# నిద్ర-కలలు

(శ్రీమాతారవిందుల రచనలనుండి సేకరణ)





తెలుగుసేత

అమరవాది వెంకటరామ శాస్త్రి
అమరవాది ప్రభావతి

ప్రకాశకులు
తెలుగుశాఖ,
శ్రీ అరవిందాశ్రమము,
పాండిచ్చేరి- 605002

ప్రతులు 750
నవంబరు 24, 1971







వెల రు 1-00

ముద్రణ
అంధ్రభవన్ ప్రెస్
శ్రీ అరవిందాశ్రమము,
పాండిచ్చేరి- 605002

# పరిచయము

శ్రీమాతారవిందుల రచనలనుండి ఎన్నికచేసిన అంశములతోకూర్చిన ఈ పొత్తము, ఆగష్టు 15 1972న శ్రీ అరవిందుల శతజయంత్యుత్సవ సందర్భంలో, శ్రీ అరవింద సొసైటీవారి కార్యక్రమాలలో భాగంగానూ, వ్యక్తిపై ఆధ్యాత్మిక జీవితాన్ని పెంపొందింప చేయుటకు సహకరించునదనెడి సంకల్పముతోను వారు ప్రచురిస్తున్న చిన్న గ్రంథములలో ఒకటి

ఈ పొత్తములు మానవజీవిత పరిధినంతనూ పరివ్యాప్తమైన 50 అంశాలపై 1971 ఆగష్టునుండి క్రమవ్యవధిలో వెలువడుచున్నాయి వీటి ముఖ్యోద్దేశము

1 ఒక విషయంపై ఉన్న శ్రీ మాతారవింద ప్రవచనముల నన్నిటినీ ఎన్నికచేసి ఒకచోట కూర్చడం,

2 వారి వారి అంతర్గతావసరాలను అనుసరించి ప్రతివారు పుస్తకములను ఎన్నుకోగలిగి, వారి ప్రశ్నలకు సమాధానాలు పొందగలగడం,

3 అందరికీ అందుబాటులో ఉండేటట్లు చేయడం.

ఈ పొత్తములు, సంపూర్ణ రచనలయందు ఆసక్తి కలుగునంతగా పాఠకులను ఉత్తేజితులను చేసి, శ్రీ మాతారవిందుల ఆశయములను అనుసరించి వారి జీవితాలను, వారి పరిసరాలను తీర్చిదిద్దుకోగలరని మేము ఆశిస్తున్నాము.

—అమరవాది వెంకటరామశాస్త్రి

# వి ష య సూ చి క

# ఒకమాట

ఈ చిన్న పుస్తకము సాధనాభిలాష గలవారికి యెంతైన వుపయో గించగలదు. అత్యంత భక్తిశ్రద్ధలతోను, యీ అనువాదకార్యము కూడ వారి సాధన యందొక భాగముగనెంచి, చక్కని సులభశైలిలో అనువదించి పంపిన శ్రీమతి, శ్రీ అమరవాది వెంకటరామశాస్త్రి గార్లకు మా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

అడగగానే, తామసములేక దీని ముద్రణకు అనుమతి నొసంగిన, శ్రీ అరవిందాశ్రమము కాపీరైట్ డిపార్టుమెంటు వారికికూడ మా కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాము

చదువరులలో ఏ ఒక్కరికైనను యియ్యది సహకరించిన ఈ తెలుగు శాఖవారి కృషి ఫలించినట్లుగనే విశ్వసింతుము ఇటులనే మరికొన్ని ప్రచు రణలను, అందరకు అందుబాటు నందుండునటుల త్వరలో అందించనున్నా మని తెలుపుకొనుటకు ఆనందించుచున్నాము

తెలుగుశాఖ

24-11-1974 శ్రీ అరవిందాశ్రమము

# రాధ ప్రార్థన

ఓ సర్వేశ్వరా! ఆ నా ప్రథమ సందర్శనమునందే యెవరిని నా హృదయేశ్వరునిగను, నా ఆత్మప్రభునిగను తెలిసికొంటినో ఆ దైవస్వరూపులైన తాము యిక నా ప్రార్థనల నందుకొనుడు.

నా భావములన్నియు, నా ఉద్రేకములన్నియు, నా హృదయము నందలి రసానుభూతులన్నియు, నా యందలి ఇంద్రియజ్ఞానములన్నియు, నా జీవితప్రవృత్తులన్నియు, నా దేహమునందలి ప్రతి అణువు, నా రక్తము నందలి ప్రతి బిందువు మీదే. నా సర్వస్వము మీదే. నేను సంపూర్ణముగ మీ దాననే. నిశ్శేషముగ మీ దాననే. నా యెడల మీ ఇచ్ఛ యెటులనో నేను అటులనే అయియుందును. మీ నుండి నాకు ప్రసాదింపబడు, సర్వము నకు—జీవనమో మరణమో, సుఖమో దుఃఖమో, ఆనందమో, బాధయో అది యేదైనను ఆహ్వానింతును. మీరు అనుగ్రహించు ప్రతి వరము సర్వదా నాకొక దివ్యవరమై వెలయుగాక! అది ఆ పరమానందమును ప్రసాదించు వరమే యగుగాక!

—శ్రీమాత

# నిద్ర ఆవశ్యకత



మన జీవితం మూడవవంతుకు పైగానే నిద్రలో గడిచి పోతుందని జ్ఞాపకముంచుకోవాలి అందువల్ల దైహికనిద్రలో గడిచే ఈ కాలాన్ని గురించి మనం శ్రద్ధ వహించవలసిన అవసరం ఉంది

మన దేహం గాఢనిద్రలో ఉన్నప్పుడు మన సత్తా అంతా నిద్రించదు కాబట్టి నేనిక్కడ దైహికనిద్ర అని చెప్పాను



దేహానికి ఆహారం అవసరమైనట్లే నిద్రకూడా అవసరం తగిన నిద్ర పోవలసినదే కానీ అధికనిద్ర అనవసరం తగినంత నిద్ర అనేది శరీరావసరాన్నిబట్టి ఉంటుంది



కావలసినంత నిద్ర పోకుండా ఉండడం పెద్ద తప్పు కనీసం ఏడు గంటలైనా నిద్రించాలి చాలా దృఢమైన నాడీ వ్యవస్థ ఉంటే ఆరు గంటలే నిద్రపోవచ్చు ఒక్కొక్కప్పుడు అయిదు గంటలే సరిపోతుంది కానీ అది అరుదు తగినంత అవసరం ఉంటేనేగానీ ఆ విధంగా చేయరాదు.



జ్వరాలకూ, మానసిక బాధలకూ నిద్ర చాలా సహాయకారి నిద్రలేమి వాంఛనీయం కాదు వ్యాధి నివారణ కిది తీరని లోటు

రాత్రిపూట మెలకువగా ఉండడానికి ప్రయత్నించడం 'మంచి పద్ధతి కాదు. కావలసిన నిద్రను అణచిపెడితే శరీరం తామసికమయి మెలకువ

ఘడియలలో ఏకాగ్రత నిలపడానికి పనికిరాదు నిద్రను అణచడం కాకుండా మార్పు చేయడం సరైన పద్ధతి నిద్రలోనే చేతనత్వాన్ని క్రమంగా ఎట్లా వృద్ధిచేసుకోవాలో నేర్చుకోవాలి అట్లా చేసినట్లయితే నిద్ర అంతరిక చైతన్యంగా మారుతుంది అప్పుడు సాధన జాగ్రదావస్థలో జరిగినట్లుగానే నిద్రలోగూడా కొనసాగుతుంది, అదే సమయంలో భౌతికపరిధిలోకే కాకుండా ఇతర చైతన్యస్థాయిలలోగూడా ప్రవేశించేందుకు వీలుకలిగి, అక్కడనుంచి ఎడతెగని విషయపరిజ్ఞానాన్నీ, ఉపయోగకరమైన అనుభవాన్నీ పొందవచ్చు

# ఎలా నిద్రించాలి?



పెందలకడనే నిద్రించి పెందలకడనే లేవడం ఏ విధముగా మంచిది?

సూర్యాస్తమయం తర్వాత ఒక రకమైన ప్రశాంతత భూమిని ఆవహిస్తుంది ఈ ప్రశాంతత నిద్రకు చాలా సహాయకారిగా ఉంటుంది

సూర్యోదయమైన తర్వాత ఒక ప్రబల శక్తి భూమిపైకి అవతరిస్తుంది అది పనిచేయడానికి సహాయపడుతుంది

నీవు ప్రొద్దుపోయిన తరువాత శయనించి ఆలస్యంగా లేచినట్లయితే ప్రకృతిశక్తులను ఎదిరించినట్లవుతుంది అది ఏమంత తెలివైన పనికాదు



నడిరేయి తరువాతకంటె ముందర ఘడియలే నిద్రకు మంచివంటారు ఎందువల్ల?

నడిరేయి వరకూ సూర్యుడు అస్తమిస్తున్నట్లున్నా,

ఆ తరువాత మొదటి గంటనుంచీ సూర్యుడు ఉదయిస్తున్నట్లున్నా సాంకేతికంగా చెపుతారు



ఎంత నిద్రపోవాలి అనేదానికంటె ఎటువంటి నిద్రపోవాలి అనేది ముఖ్యం నిద్ర నీకు మంచి విశ్రాంతినీ, ప్రశాంతినీ కలుగజేయాలంటే శయనించే ముందు ఒక కప్పు పాలుగానీ, సూప్‌గానీ, పళ్ళరసంగానీ తీసుకోవడం చాలా మంచిది ఆహారము మితంగా తీసుకుంటె ప్రశాంతమైన నిద్ర వస్తుంది ఏ సందర్భంలోనూ మితంతప్పి ఆహారం తీసుకోకూడదు అట్లా తీసుకుంటే అది నిద్రను చికాకుపరచి పీడకలలతో కలవరపెడుతుంది, లేదా అగమ్యగోచరంగానూ, భారంగానూ, మత్తుగానూ ఉండే నిద్రను కలుగచేస్తుంది అన్నిటికన్నా ముఖ్యం, మనస్సును నిర్మలంగా ఉంచుకోవడం, సంవేదనలను శాంతపరచడం, పొంగివస్తున్న కోరికలను వాటి అనుబంధ కార్యకలాపాలను ప్రశాంతపరచడం శయనించేముందు ఎక్కువగా మాట్లాడినా, ఉత్తేజవంతమైన చర్చలు చేసినా, ఉద్రిక్తతను, ఉత్తేజాన్ని కలిగించేవి చదివినా, కొంతసేపు విశ్రాంతి తీసుకొని ఆ తర్వాత నిద్రించడం మంచిది దానివల్ల మానసిక ఉత్తేజం తగ్గి, దైహిక అంగాలు నిద్రిస్తుండగా మెదడు అక్రమచలనాలకి తావివ్వకుండా ఉంటుంది. అంతేకాకుండా నీకు ధ్యానంచేసే అలవాటు ఉన్నట్లయితే, ఉన్నతమైన విశాల చేతనత్వంకోసం ఆకాంక్షతో అత్యుత్తమమైన ప్రశాంత భావనపై ఏకాగ్రత నిలపడం మంచిది ఇది నిద్రకు చాలా సహాయంగా ఉంటుంది, నిద్రపోతున్నప్పుడు చైతన్యరహిత స్థితిలో పడకుండా తప్పించుకోగలుగుతావు



నిద్రించేముందు శ్రీమాతను ధ్యానించుకొని ఆమెపై ఏకాగ్రత నిలిపి, ఆమె రక్షణలోనే ఉన్నట్లు అనుభూతిని పొందడానికి ప్రయత్నంచేసి, ఆ భావనలోనే నిద్రించే నియమం

చేసుకోవాలి కలలోగూడా ఏదైనా కష్టంకలిగినా, ఆపదవచ్చినా శ్రీమాతను తలుచుకోవడమనేది అలవాటు చేసుకోవాలి చాలామంది సాధకులు ఆ విధముగా చేస్తారు కలలోనైనా, ధ్యానసమయంలోనైనా, తదితర సమయాల్లోనైనా దివ్యశక్తితప్ప మరి యే ఇతరశక్తినీ దరిచేరనీయివద్దు ఏదైనా ఇతరశక్తిగానీ, జీవాంశగానీ నీపై దాడికి వస్తే తిరస్కరించాలి, ప్రత్యేకమైన దృష్టితో చూడడంద్వారాగానీ, బలహీనత ద్వారాగానీ వాటిని రానీయవద్దు

బాగా నిద్రించడానికి ఎలా నిద్రపోవాలో తెలిసిఉండాలి



నీవు దైహికంగా బాగా అలసి ఉన్నప్పుడు వెంటనే నిద్రకు ఉపక్రమించడం అంత మంచిదికాదు అట్లా నిద్రపోతే నీవు చైతన్యరహిత స్థితిలోకి వెడతావు మరీ అలసి ఉన్నప్పుడు పడకమీద కొంచెంసేపు నడుంవాల్చి, విశ్రాంతి తీసుకొని, ఒకదాని తర్వాత ఒకటిగా నరాలకు సేదతీర్చి చివరకు నీకు ఎముకలు, కండరాలు ఏవీ లేవనిపించేటట్లుగా, అంటే ఇంచుమించు ఒక గుడ్డపీలిక మాదిరిగా అయి పట్లు వదిలించుకో తరువాత తలకిగూడా ఆ విధంగానే చేయి ఏ భావనమీదనూ ఏకాగ్రత చేయకుండా, నీ సమస్యా పరిష్కారాలను గురించి ఆలోచించకుండా, పగలు జరిగిన సంవేదలు ముద్రలు, ఉద్రేకాలు మొదలైనవాటిని గురించి పదే పదే ఆలోచించకుండా, విశ్రాంతి తీసుకో వీటి నన్నిటినీ ప్రశాంత చిత్తంతో వదులుకోవాలి అట్లా వదలించుకొంటే నీవు ఒక గుడ్డపీలిక మాదిరిగా భారరహితంగా అవుతావు ఆ విధంగా చేయడంలో నీవు కృతకృత్యుడవైతే ఎల్లప్పుడూ వెలిగే ఒక చిన్నజ్యోతిని చూడగలుగుతావు ఈ రకంగా పట్లు వదిలించుకొన్నప్పుడు నీవు దాని చేతనంలో ఉంటావు ఆ చిన్నజ్యోతి ఉన్నట్లుండి దివ్యజీవనం, దివ్యసత్యం, దివ్య చైతన్యముల కొరకూ ఆంతరిక సత్తతో విలీనం పొందడం కొరకూ అధిక ఆకాంక్షతో పైకిలేవడం మొదలుపెడుతుంది తనను తనె అధిగమించి సన్నితంగా

పైకిలేచి అక్కడే కేంద్రీకరిస్తుంది ఆ సమయంలో నీవు నిద్రిస్తే చాలా మంచి నిద్ర పడుతుంది నీవు జాగ్రతగా అట్లా చేసినట్లయితే అంధకారంలో పడి నిద్రపోకుండా, తేజోవంతంగా నిద్రించి, ఉదయం లేచినప్పుడు సంతోషంగానూ, సంతృప్తిగానూ, హాయిగానూ, రోజంతటికీ కావలసిన శక్తిని సమకూర్చుకున్నట్లుగానూ ఉండడం తథ్యం



సమాధి స్థితిలోకి ఎన్నడూ వెళ్ళని వారైనా ఒక మంత్రాన్నిగానీ, ఒక మాటనుగానీ ఒక ప్రార్థననుగానీ నిద్రించేముందు మననం చేసుకుంటే మంచిది ఆమాటలు జీవంతో ఉండాలి, వాటికి మేధావంతమైన అర్థం ఉండవలెనని కాదుగానీ తేజో ప్రకంపనాలను కలిగించేదిగా మాత్రం ఉండాలి దేహంపై వాటి ప్రభావం అనాధారణంగా ఉంటుంది ఆ ప్రకంపనాలతో దేహం సంచలితమైపోయి క్రమంగా, ప్రశాంతంగా, నిద్రనుకోరుతున్నట్లుగా తూగిపోతుంది క్రమంగా తూగితూగి గాఢ సుషుప్తిలో మునిగిపోతావు అదే తామసానికి ద్వారం మార్గం తామసము చెడ్డ నిద్రను కలుగ చేస్తుంది చెడ్డనిద్ర చెండిపికలుగా ఉంటుంది నిన్ను భారంగానూ, మందకొడిగానూ చేసి, ఆ క్రిందటిరోజుకో నీవుచేసిన ప్రయత్న ప్రభావమంతా పోగొట్టుకుంటావేమో నటిపించేటట్లు చేసే నిద్ర ఒకరకం, నీ కాలమంతా సంఘర్షణతో గడిపితే నిరసించినట్లుగా నిద్ర సింపజేసే నిద్ర ఒకరకము దఫాల వారీగా నిద్రించితే (ఇలాంటి మెరుగైన పద్ధతులలో అది ఒకటి) రాత్రులు బాగుంటాయని నేను గమనించాను అంటే నిర్ణీత వ్యవధానాలలో నీవు సాధారణ చైతన్యంలోకి, ఆకాంక్షకూ తిరిగి రాగలిగి ఉండాలి దానికోసం నీవు అలారం గడియారాన్ని ఉపయోగించరాదు నీవు సమాధి స్థితిలో ఉన్నప్పుడు కదిలించబడడం మంచిదికాదు

నీవు నిద్రపోయేముందు ఈ విధంగా తీర్మానం చేసుకో, "నేను సరిగా ఫలాన గంటకు లేస్తాను" అని (నీవు చిన్నతనంలో ఉన్నప్పుడు

ఈ పద్ధతిని బాగా అనుసరించగలవు) మొదటి నిద్ర కనీసం మూడుగంటలైనా ఉండాలి పిదనిద్ర ఒక గంట సరిపోతుంది మొదటినిద్ర మూడు గంటలు తప్పనిసరి మొత్తంమీద ఏడుగంటలు నీవు పడకపైన ఉండాలి ఆరు గంటలకో ఎక్కువ ఏమీ చేయడానికి వీలుకాదు (నేను సాధనను దృష్టిలో పెట్టుకొని రాత్రులను ఎట్లా వినియోగించుకోవాలో చెపుతున్నాను )

రాత్రులను వినియోగపరుచుకోవడం చాలా ఉత్తమమైన పద్ధతి, దాని వల్ల రెండు రకాలైన ఫలితాలు ఉంటాయి ప్రథమంగా ప్రతికూల చర్య జరుగకుండా చేయడం, అంటే నీవు సాధించినదానిని పోగొట్టుకొని కిందికి పడకుండా అవుతుంది (అది చాలా బాధాకరమే), దాని అనుకూల ప్రభావం వల్ల నీవు కొంచెం పురోగమిస్తావు ఇట్లా రాత్రి సమయాన్ని వినియోగించుకున్నావంటే నిరాశ జాడ ఉండదు

నీవు పరిహరింపవలసినవి రెండున్నాయి, అపచేతనా జడత్వం లోపడిపోవడం, అంటే ఉపచేతన అపచేతనలతో పైకి వచ్చి నీపై దురాక్రమణ జరిపి, నీలో ప్రవేశించే జడత్వం ఒకటి, రెండవది ప్రాణమయ, మనోమయ కోశాల అతిఘోరణి ఇక్కడ నీ సమయమంతా పోరాటాలలోనే గడచిపోతుంది (అక్షరాలా పోరాటాలే) ఈ స్థితిలోనుంచి అందరూ దెబ్బ తిన్న వారిలాగా (నిజానికి దెబ్బలే తగులుతాయి) వస్తారు దీనికి ఒకే ఒక మార్గం కనిపిస్తుంది నిద్ర పద్ధతినే మార్చాలి



ఇటీవల కనుగొన్న వైద్యశాస్త్ర సిద్ధాంతం ఏమంటే మనుషులు నిద్రలో పరిపూర్ణ విశ్రాంతి, నిస్తబ్ధత, ఉన్నతస్థితి చేరేవరకూ అనేక స్థాయిలు దాటుతారు, ఆ పరిపూర్ణ విశ్రాంతిలో పది నిమిషాలే ఉంటారు, మిగిలిన కాలమంతా ఆ స్థితిని చేరడానికీ, తిరిగి మేల్కొనే స్థితికి రావడానికి సరిపోతుంది ఆ పది నిమిషాల కాలాన్నే

బ్రహ్మసుషుప్తి లేదా బ్రహ్మలోక సుషుప్తి అనవచ్చని నా ఉద్దేశ్యము. మిగిలినదంతా స్వప్నం లేక ఇతర లోకాలలో చేసే ప్రయాణము (చేతనా జీవన స్థితులు లేక స్థాయిలు) ఈ పది నిమిషాల నిద్రే సత్తువ శక్తిని పునస్థాపనం చేస్తుంది అది లేకపోతే నిద్రపోయినట్లే ఉండదు

మనిషి జాగ్రదావస్థనుంచి నిద్రా చైతన్యపు వివిధ అనుక్రమణ స్థాయిలద్వారా అనేక లోకాలలో ప్రయాణంచేసి చివరకు పరిపూర్ణ విశ్రాంతి వెలుగు, నిశ్శబ్దములతోగూడిన సచ్చిదానంద స్థితికి చేరుకుంటాడనీ, అక్కడ నుంచి తిరిగి జాగృత భౌతిక స్థితికి తిరుగుప్రయాణం చేస్తాడనేది శ్రీమాత అనుభవరీత్యా తెలుసుకొన్న విషయం ఈ సచ్చిదానందమయంలో ఉండే కొద్ది సమయం మాత్రమే నిద్రకు పునరుద్దీపన శక్తిని ఇస్తుంది ఈ విధంగా విజ్ఞానశాస్త్రమూ తాంత్రిక ఆధ్యాత్మికశాస్త్రమూ చెప్పినవి ఒకదానికొకటి సరిపోయినాయి, తాంత్రిక ఆధ్యాత్మికశాస్త్రం పూర్వం చెప్పినదాన్నే, నూతనంగా విజ్ఞానశాస్త్రంగూడా ఆవిష్కారం చేసింది

గాఢ నిద్ర అంటే ప్రజలకుండే అభిప్రాయాలు పూర్తిగా దోషభూయిష్ఠమయినవి బాహ్య చైతన్యాన్ని పూర్తి ఉపచైతన్యంలోకి దాటవేయడమే గాఢనిద్ర అని వారంటారు కానీ ఉపరితల నిద్రాచైతన్యమనేది బాహ్యచైతన్యం పూర్తిగా దాటని స్థితి ఆ నిద్రాస్థితిలో బాహ్యచైతన్యం ఇంకా పనిచేస్తూనే ఉండడంవల్ల, కలలను నమోదుచేసి భౌతికమనస్సుకి పంపలేదు ఈ వుపరితల నిద్రాచైతన్య స్థితినే మనవారు కలలులేని గాఢ నిద్ర అంటారు నిజానికి నిద్ర అంతా పూర్తిగా స్వప్నమయిపోను ఎచొచ్చి బ్రహ్మలోకంలో వుండే కొద్ది క్షణాలూ కలలు ఆగిపోతాయి



# కలల స్వభావము - వాటి ప్రాముఖ్యత



స్వప్నాలను గుర్తించడం, వాటిమధ్య తేడాలను గమనించడం నేర్చుకోవాలి వాటి స్వభావ గుణాదులలో వైవిధ్యం చాలావుంది కాబట్టి వాటిని వేర్వేరుగా గుర్తించాలి

ఎక్కువ భాగం కలలు అడుపాజ్ఞలు లెని దైహిక మెదడు చేసే యాంత్రిక పర్యలే కావడంవల్ల వాటికి మరి ఏ రకమైన ప్రాముఖ్యతా వుండదు వాహ్యంనుంచి గ్రహించిన ముద్రలకు, అనురూపంగావుండే సంవేద్యనీయ ముద్రలనూ, ప్రతిమలనూ తయారుచేసే దైహిక మెదడు కణాలు కొన్ని నిద్రలోగూడా క్రియాత్మకచర్యను కొనసాగిస్తూనే వుండడం వల్ల ఈ కలలు వస్తాయి

ఈ రకమైన కలలు ఇంచుమించుగా ఎప్పుడూ భౌతిక కారణాల మీదనే ఆధారపడివుంటాయి, ముఖ్యంగా ఆరోగ్యస్థితిమీదా, జీర్ణశక్తిమీదా, పడక కుదరడంమీదా ఆధారపడివుంటాయి

కొంత స్వయంపరిశీలనం చేసుకోవడంవల్లనూ, కొన్ని జాగ్రతలు తీసుకోవడంద్వారానూ ఈ రకమైన కలలు రాకుండా చేసుకోవచ్చు, అవి పనికిమాలినవే కాకుండా నిస్త్రాణనుకూడా కలిగిస్తాయి కాబట్టి వాటికి మూలమైన దైహిక కారణాలను తొలగించి అవి రాకుండా చేసుకోవాలి.

ఇంకా కొన్ని రకాల కలలు వున్నాయి అవి యాదృచ్ఛికంగా జరిగే సంఘటనలు, భావనలు, సంభాషణలు, తలంపులు మొదలైనవాటికి సంబంధించిన కొన్ని మానసికశక్తుల అపసవ్యధోరణులకు వ్యర్థ ప్రతిబింబాలు.

ఇటువంటి కలలకు చాలా ప్రాముఖ్యం వుంది ఎందువల్లనంటే మానసికసత్త ఇచ్ఛాశక్తి అదుపులో లేనప్పుడు అక్కడ ఏర్పడే అవవ్యవస్థ ఈ అపసవ్య ధోరణులద్వారా తెలుసుకోవచ్చు ఈ సత్త ఇంకా మనలో వ్యవస్థాపనం కాలేదనీ, శ్రేణీకరణం చెందలేదనీ ఋజువవుతుంది అంటే అది ఇంకా స్వయంపోదక జీవితానికి తయారు కాలేదన్నమాట

ఇంకమింక ఈ కలల మాదిరిగానే వుండి, చాలా ప్రాముఖ్యమైన ఫలితములనిచ్చే కలలు వున్నాయి అంతరికసత్త తాత్కాలికంగా మన అదుపులోనుంచి స్వేచ్ఛను పొందినప్పుడు దాని పగవల్ల ఈ కలలు వస్తాయి ఇవి మన సత్తలో ఎక్కడో మూలన దాగివున్న కొన్ని సంస్కారాలను, అభిరుచులను, ప్రచోదనలను, కాంక్షలను మనం గమనించేటట్లు చేస్తాయి మామూలుగా అయితే మన ఆశయాన్ని సాధించుకోవాలనే మన సంకల్పం వీటిని అణచిపెడుతూ వుండంవల్ల గుర్తించము



మానవుడు తన నిజస్వరూపాన్ని నిద్రలోనే తెలుసుకుంటాడని అంటారు సాధారణంగా పగటిపూట మన సంకల్పపు అధీనంలోనే ఇంద్రియసత్త ఉంటుంది రాత్రిపూట ఆ ఆంక్ష సడలగానే అది విజృంభిస్తుంది. విలీనం చెందకుండా అణిగియున్న వాంఛలు (అనేకరకాలుగా పరిశీలనలు చేసుకొని ఉన్నతస్థాయిలో సమగ్రమైన ఋజువర్తనతో వీటిని పైతొలగించాలి) రాత్రిపూట మన సంకల్పం నిద్రిస్తున్నప్పుడు తమ పరితృప్తికోసం ప్రయత్నిస్తాయి

వాంఛలనేవి నిజానికి రూపకల్పనలవల్ల ఏర్పడే శక్తికేంద్రాలు కాబట్టి అవి తమ పరితృప్తి కోసమై మనలోనూ, మన చుట్టూనూ వాటికి అనుకూలంగా వుండే పరిస్థితులను సమృద్ధిగా ఏర్పరచుకుంటూనే వుంటాయి

ఈ విధంగా మన చేతనాలోచన పగటిపూట చేసిన ప్రయత్నఫలిత మంతా రాత్రి కొద్ది గంటలలోనే నాశనమౌతుంది

వాంఛలు ఏర్పరచుకునే ఈ పరిస్థితే, పురోగమించుదామనుకునే మన సంకల్పానికి ఎదురయే ప్రతిరోధానికి ముఖ్యకారణమవుతుంది మనం అధిగమించలేమేమో ననుకునే కొన్ని కష్టాలకుగూడా ఇదే కారణము కాని మనకి మన సత్సంకల్పం పరిపూర్ణంగానే కనిపించడంవల్ల దీనిని వివరించలేము

అందువల్ల మనం కలలను పోల్చుకోవడం నేర్చుకోవాలి స్వభావాదులలో తేడా వుంటుంది కాబట్టి వాటి తేడాలను గుర్తించాలి సాధారణంగా ఒకే రాత్రిలో నిద్రగాఢతనుబట్టి వివిధ వర్గాలకు చెందిన కలలు రావడం జరుగుతుంది

## మన స్వప్నాలను మనం ఎందుకు మర్చిపోతాము?



అన్ని స్వప్నాలూ నీవు ఒక పరిస్థితిలోనే వున్నప్పుడు రావు కలలుకనేది ఎప్పుడూ నీ సత్తలోని ఒకే విభాగంకాదు, ఒకే స్థితిలోనూ కాదు నీవు నీ సత్త విభాగాలన్నిటితో సచైతన్యంగా సూటిగా నిరవధికమైన వహనసంపర్కం కలిగివుంటే నీ కలలన్నిటినీ జ్ఞాపకముంచుకోగలవు కానీ నీ సత్తలోని కొన్ని విభాగాలతోనే నీకు వహనసంపర్కం వుంటుంది

నీ భౌతిక శరీరానికి దగ్గరగావుండే సూక్ష్మభౌతిక శరీరంలో నీకు కల వచ్చిందనుకుందాము సాధారణంగా నిద్ర చివరిభాగంలో, తెల్లవారు ఝామున నాలుగు, అయిదు గంటలమధ్య ఈ కలలు వస్తాయి నీకు మెలకువ వచ్చినవెంటనే కదిలిపోకుండా చాలాప్రశాంతంగా, నిశ్చలంగా, కొంచెం

శ్రద్ధతో ఏకాగ్రతగా వున్నావంటే నీకు ఈ కలలు గుర్తుంటాయి నీ సూక్ష్మ శరీరానికీ, శరీరానికీ మధ్యన వహనసంపర్కం ఏర్పడి వుండబట్టి అవి గుర్తుంటాయి ఈ వహనసంపర్కం లేకపోవడమనేది అరుదు.

చాలావరకు కలలను ఎందుకు మరచిపోతారంటే, నీవు ఒక పరిస్థితిలో వున్నప్పుడు ఒక కలగని ఇంకొక పరిస్థితిలోకి వెడతావు ఉదాహరణకు నీవు నిద్రిస్తున్నప్పుడు నీ దేహం, నీ ప్రాణమయశరీరం నిద్రిస్తాయి, నీ మనస్సుమాత్రం ఉత్తేజితమై పనిచేస్తూ కలలుగనడం ప్రారంభిస్తుంది అది కొంతవరకూ సమన్వయీకరించుకొని ఊహాగానం చేయడంవల్ల నీవు కలలలో అన్నిరకాల వస్తువులనూ చూడడం, అసాధారణ సంఘటనలలో పాల్గొనడం జరుగుతుంది కొంతసేపటికి అంతా సద్దుమణిగి మనస్సుగూడా మగతకు లోనవుతుంది అప్పుడు అంతవరకూ నిద్రిస్తున్న ప్రాణమయ శరీరం మేల్కొని, భౌతిక శరీరంలోనుంచి బయటకువచ్చి నడక ప్రారంభించి అటూఇటూ తిరుగుతుంది, అన్నిరకాల పనులూ చేస్తుంది, ప్రతిచర్యలు చేస్తుంది, పోట్లాడుతుంది, ఏదైనా తింటుంది ప్రాణమయ శరీరానికి సాహసం ఎక్కువ అన్నీ పరిశీలిస్తూవుంటుంది వీరావేశం కలిగినప్పుడు చెరసాలలో బందీలను రక్షించడానికి పరుగెడుతుంది, శత్రువులను నాశనం చేస్తుంది, అద్భుతమైన ఆవిష్కారాలు చేస్తుంది మానసిక స్వప్నాల నన్నిటినీ ఇది వెనక్కి నెట్టివేస్తుంది ఈ విధంగా మానసిక స్వప్నాలు చెరిగిపోయి దాని స్థానాన్ని ప్రాణికస్వప్నం ఆక్రమించడంవల్ల అవి ఏమాత్రం గుర్తుండవు కానీ ఆక్షణంలో నీవు హఠాత్తుగా లేస్తే నీవు గుర్తుంచుకోగలవు ఈ విధంగా కొంతమంది చేసి చూశారు వారు ఒక నిర్ణీత వేళకి ప్రతి రాత్రీ లేస్తారు అట్లా హఠాత్తుగా లేచినప్పుడు వారికి కల గుర్తుంటుంది ఏమాత్రం కదలకుండా సహజసిద్ధంగా మేల్కొంటే నీవు గుర్తుంచుకోగలవు

తిరిగి తిరిగి అనేక రకాల సాహసచర్యలుచేసి అలసిపోయిన ప్రాణ మయ శరీరం విశ్రాంతికోసం నిశ్శబ్ద విరామస్థితికి వెడుతుంది అప్పుడు ఇంకొకటి మేల్కొంటుంది ఉదాహరణకు సూక్ష్మదేహమే తిరగడానికి బయలుదేరిందనుకుందాము అది మెల్లిగా తిరుగుతూ గదులన్నీ చూస్తూ వుంటే ఆ గదిలోది ఈ గదిలోకి, ఈ గదిలోది ఆగదిలోకీ మారివుంటాయి కదలకుండా లేస్తే నీకు అన్నీ జ్ఞాపకముంటాయి కాని ఇది ప్రాణిక శరీరపు కలలన్నిటినీ చైతన్యంతో అడుగుకి నెట్టివేయడంవల్ల నీకు గుర్తుండవు ఆ సమయంలో నీవు మేల్కొంటే తొందరపడకుండా, పడకపైన కళ్ళు తెరవ కుండా నీకు యిష్టమైనంతసేపు వుండు మేల్కొన్నప్పుడు వున్నచోటే తలను వుంచి, నీలో నీవే ప్రశాంతమయిన అద్దంగా అయి ఏకాగ్రతను అక్కడ నిలుపు అప్పుడు నీవు స్వప్నాంతంలోని చివరి ముక్కను అందు కుంటావు దానిని పట్టుకొని నెమ్మదిగా కదలకుండా మిగిలిన భాగాన్ని లాగు కల చివరిభాగంనుంచీ వెనక్కి వెళ్ళు నెమ్మదిగా అంతా వెనక్కి జరుగు తుంది హఠాత్తుగా కల అంతా పునశ్చరణ అవుతుంది "ఓహో, ఈ విధంగా వున్నదా" అనిపిస్తుంది ఆ సమయంలో దూకుడుగా లేవకూడదు' కదలకూడదు నీకు కల అంతా వివరంగా తెలిసేవరకూ దానిని అనేకసార్లు పునశ్చరణ చేసుకో ఈ కల ప్రస్ఫుటంగా అయిన తర్వాతగూడా కదల కుండానే వుండి ఇంకా లోపలికి వెళ్ళడానికి ప్రయత్నించు అప్పుడు ఇంకొక స్వప్నాంతభాగం నీకు దొరుకుతుంది, అది చాలా అడుగున వుండి అస్ఫు టంగా వున్నప్పటికీ నీవు దానిని పునశ్చరణ చేయవచ్చు, నీవు దాన్ని ఆధా రము చేసుకొని పట్టుకొని లాగు, అంతా మారి నీవు ఇంకొక లోకాన్ని చూస్తావు, హఠాత్తుగా నీకు ఒక అసాధారణ సన్నివేశం తగులుతుంది, అది ఇంకొక కల అన్నమాట అదే మాదిరిగా దీనినిగూడా నీకు స్పష్టపడేవరకు అనేకసార్లు పునశ్చరణ చేయి అంతసేపూ కదలకుండా నిశ్చలంగా వుండు,

అప్పుడు ఇంకా నీ లోపలికి చొచ్చుకొని పో, పోగా పోగా అకస్మాత్తుగా నీకొక అస్పష్టమైన రూపన కనిపిస్తుంది. కమ్మతెమ్మెరలు వీస్తున్నట్లు, పిల్ల గాలులు తగులుతున్నట్లు నీకు భావన కలుగుతుంది. "బాగుంది, బాగుంది" అనుకుంటావు. అది ఒక స్పష్టమైన రూపాన్ని ఏర్పరచుకుంటుంది. అది మూడవవర్గిమన్నమాట నీకు సమృద్ధిగా కాలవ్యవధీ, ఓర్పూ, ప్రశాంతమైన చిత్తమూ, శరీరంలో స్థిరమూ నిశ్శబ్దమూ వుంటే రాత్రి జరిగిన నీ కథ నంతనూ తుదినుంచీ మొదలుదాకా చెప్పగలవు

నీ సత్తమీద ప్రగాఢమైన ముద్రవేసినది కలలో మధ్యభాగమో, అంత్యభాగమో అని కలను గుర్తుచేసుకోవానికి ఇంతపెద్ద, కష్టమైన శ్రమ లేకుండా ఉండవలెనంటే మెలకువ రాగానే నేను చెప్పినట్లు చేయి, నీ తలను తలగడమీద ఏమాత్రం కదలకుండా ప్రత్యేకంగా శ్రద్ధతీసుకొని, స్థిరంగా ఉండి కలను తిరిగి రానీయి

ఒక స్థితినుంచి మరొకస్థితికి చేరడానికి కొంతమందికి గమము (దారి) వుండదు ఒకరకమైన అంతరం వుండడంవల్ల దూకవలసివస్తుంది సత్త అన్ని స్థితులనూ చేతనంలో అసంతత రాకుండా కలిపివుంచే దారిలేదు మీకు గుర్తుండదుకానీ అక్కడొక చీకటివివరం వుంటుంది అది ప్రపాతం మాదిరిగా వుంటుంది అక్కడ చేతనను పొడుగించుకోవాలి ఇక్కడ వంతెన నిర్మించాలంటే చాలాకాలం పడుతుంది. నిర్మాణాత్మక వంతెనకంటె ఎక్కువకాలం కావాలి ఈ విధంగా చేయడం తెలుసుకొన్నవారు కొద్దిమంది వున్నారు. వారు చేయాలనుకుంటారు. కానీ వారు చాలా ఉత్కృష్టమైన కార్యకలాపాలలో నిమగ్నులై వుండవచ్చు. వారు గుర్తుంచుకోరు. ఒక్కొక్కసారి సామరస్యచలనం లేకుండా, దైహికచర్యే అయిన కల చిట్టచివరి భాగాన్ని గుర్తుంచుకుంటారు; ఆ కలకి అర్థం వుండదు

రోజులు అనేకరకాలుగా వుండి వేర్వేరు కార్యకలాపాలున్నట్లుగానే, రాత్రులూ, నిద్రలూ అనేకరకాలుగా వుంటాయి ఒకేరకంగా వుండేరోజులు చాలాతక్కువ ప్రతిఒక్కరోజూ ప్రత్యేకంగానే వుంటుంది పగళ్ళు ఒకే రకంగా వుండవు కాబట్టి రాత్రులుకూడా ఒకేరకంగా వుండవు నీవూ, నీ స్నేహితులూ ఒకే పనిని చేస్తున్నట్లుగా కనిపించినా అది ప్రతి ఒక్కరికీ తేడాగానే వుంటుంది ఎవరి విధానం వారిదే

మనకి వచ్చిన కలలను వ్రాసుకోవడంవల్ల ఏమైనా ప్రయోజనం వుంటుందా?



ఉంటుంది నేను ఈ రకమైన ఆత్మశిక్షణను ఒక సంవత్సరం పైగా అమలుజరిపాను కొన్ని మాటలు, ప్రతి చిన్న విషయం, ప్రతి భావనాముద్ర మొదలైనవన్నీ రాస్తూ వుండేదానిని ఒక స్మృతినుండి మరియొకస్మృతికి వెళ్ళడానికి ప్రయత్నం చేసేదానిని మొదట్లో ఫలితమేమీ కనుపించలేదు, గానీ, పదునాలుగు నెలలు గడిచేసరికీ కలలో చివర మొదలుపెట్టి, రాత్రి తొలిభాగానికి వచ్చేవరకూ అన్ని స్మృతులనూ పునశ్చరణ చేసుకోగలిగాను

మనం ఎవరినైనా కలలో చూచినప్పుడు చేతనమే విభాగిత మవుతుందా? లేక ఇతరులను గురించిన కలలనేవి మన ఊహలా?



సాధారణంగా ప్రాణమయ చేతనమే శరీరంలోనుంచి బాహ్యానికి వెళ్ళి, శరీరాకృతిగా రూపొందుతుంది ఒకరు మరియొకరిని కలలో చూచారంటే వారిరువురూ రాత్రి కలలో కలుసుకున్నా

రనే దాని అర్థము సాధారణంగా ఆ కలయిక ప్రాణమయ స్థాయిలోనే వుంటుంది, లేదా సూక్ష్మభౌతికంలోగానీ మనోమయంలోగానీ మరి యింకె క్కడైనాగానీ జరుగవచ్చు రకరకాలుగా సంభవాలు ఎన్నయినా కలలో వుండవచ్చు

# సచేతస ఇచ్ఛ-కలలు

తల్లీ! మనము మన కలల గతిని చేతన ఇచ్ఛద్వారా మార్చవచ్చునని గదా మీరు లోగడ చెప్పితిరి?

నిజమే ఈ విషయాన్ని అదివరలో ఒకసారి చెప్పాను నీ కల మధ్యలో నీకు ఇష్టములేనిది ఏదైనా జరిగితే (ఉదా॥ నిన్ను చంపురానని ఎవరైనా బెదిరిస్తుంటే) అప్పుడు "అదేమీ కుదరదు, నా కల ఆ విధంగా వుండడం నాకిష్టంలేదు" అనిచెప్పు, నీవు ఆ పనినిగానీ, లేదా కల ముగింపునుగానీ మార్చగలుగుతావు ఇచ్ఛతో నీ కలను వ్యవస్థీకరించుకోగలవు ఎవరి కలను వారు ఏర్పాటుచేసుకోవచ్చు కలగంటున్నావనే చేతనమూ, అది కలేననే జ్ఞానమూ నీకుండాలి.

కొంతమంది పిల్లలు ప్రతిరాత్రీ శయనించినప్పుడు ఒకేచోటకు వచ్చి వారి పూర్వపుకలను కొనసాగిస్తారు ఇంతకంటె కుతూహలమైంది ఇంకొకటి లేదు రాత్రులందు ఇదొక వినోద కాలక్షేపమే ఒక కలను మొదలు పెడతావనుకో, నిద్ర లేవవలసిన సమయం కాగానే ఆఖరు మాటలదగ్గర ఆపి, నీ శరీరంలోకి తిరిగివస్తావు, ఆ తరువాత

రాత్రి మళ్ళీ అక్కడ మొదలుపెట్టి నీ ప్రాణమయచేతనం బాహ్యంగా వున్నంతసేపూ కథను చెపుతూనే ఉంటావు, అప్పుడు అన్నిటినీ ఒక క్రమములో ఉంచుతావు, (అది మంచి మనోహరమైన ఏర్పాటుగా వుండాలి) తిరిగివెళ్ళిపోయే సమయం అయినప్పుడు ఆపేసి వాటితో "నేను వచ్చేవరకూ నిశ్శబ్దంగా వుండండి" అనిచెప్పి శరీరంలోకి తిరిగి వచ్చేస్తావు దీనిని ప్రతి రాత్రీ కొనసాగిస్తావు చివరికి ఇవన్నీ గుర్తుంచుకుంటె అద్భుతమైన కథల పుస్తకాన్నే వ్రాయగలవు

ఇదంతా పగలు ఎంత ప్రశాంతంగా గడిపావో అనే దానిమీద ఆధారపడి వుంటుందా?

కాదు అది పిల్లల నిర్మలత్వం మీదా, తారసపడే వస్తువులపై వారి నమ్మకం మీదా, విమర్శనారహిత వైఖరిమీదా, సరళ హృదయత మీదా, తరుణ క్రియాత్మక శక్తిమీదా ఆధారపడి వుంటుంది (అంతరంగా ఒక రకమైన ప్రాణమయ ఔదార్యమే అది స్వాతిశయము, దురాశ ఉండరాదు అతి ప్రయోజనాత్మక దృష్టితోగానీ అతి ఆచరణాత్మకంగా గానీ ఉండరాదు) చేయరాని పనులు చాలా ఉన్నాయి, అవి పిల్లలు చేయరు వాటికి తోడు సజీవ చింతనాశక్తి ఉండాలి ఎందుకంటే (నేనేదో పనికిరాని ఎన్నో చెపుతున్నట్లుగా ఉంటుంది, కానీ ఇది కేవల సత్యమే) నీవె పరిమసృష్టికర్తవై, భావనలను తయారుచేసె లోకం ఒకటుంది, అదే నీ ప్రాణమయ ప్రపంచము అక్కడ నీవొక సృష్టికర్తవుగా ఒక అద్భుత ప్రపంచాన్ని చేయవచ్చు దానిని ఎట్లా ఉపయోగించాలో తెలుసుకొని, నీకొక చిత్రకారుని చేతనమైనా, కవిచేతనమైనా ఉండి సామంజస్యము, సౌందర్యములను ఆరాధించే వాడివైతే, అక్కడ ఒక అద్భుతాన్నే తయారుచేయగలవు అది భౌతికంగా వ్యక్తమయే పద్ధతిలో ఉంటుంది

దానినే చిన్నప్పుడు నాకు నేనే కథలు చెప్పుకోవడం అనేదానిని అది మాటలతో కథచెప్పడం కాదు మనస్సుతో చెప్పుకోవడమే. అంటే నిర్గమన ప్రదేశానికి (మనస్సులో) వెళ్ళి అక్కడ ఒక విచిత్రకథను కల్పించడం ఈ విధంగా కథలను చెప్పడం నేర్చుకున్నప్పుడు. అది అందంగానూ సమంజసం గానూ, దృఢ సమన్వయాక కరణాన్ని పొందిఉంటే. అది నీ జీవితంలోనే అభివ్యక్తమవుతుంది. యథాతథంగా గాకపోయినా నీవు ఏదిచేసి ఉండి ఉంటావో దానికి కొంచెం ఎక్కువగానో తక్కువగానో విరూపములో భౌతికముగా రూపొందుతుంది దానికి కొన్ని సంవత్సరాలు పట్టినా పట్టవచ్చుగానీ నీ కథమాత్రం నీ జీవితాన్ని వ్యవస్థీకరిస్తుంది

మనోహరమైన కలలను కల్పించేవారు చాలా కొద్దిమంది మాత్రమే ఉంటారు. కానీ వారు దానితో ఎప్పుడూ ఘోరాలను కలిపివేస్తూ తరువాత విచారిస్తారు

ఇట్లా ఘోరాలను కలుపకుండా ఎవరైనా ఒక మంచి కథను కల్పించి అందులో సౌందర్యం తప్ప ఇంకేమీ లేకుండాచేస్తే అది అందరి జీవితాల మీదా కొంత ప్రభావాన్ని కలుగచేస్తుంది. కానీ వారెరుగరు

ఈ సృజనాత్మకశక్తిని ప్రాణమయ రూపాల లోకంలో వినియోగించ గలిగితే. అది శైశవంలో ఉండగానే చేయగలిగితే చాలా బాగుంటుంది. అప్పుడే వారు వారి పదార్థమయమైన విధి క్రమాన్ని నిర్మించుకుంటారు. కానీ సాధారణంగా నీ చుట్టూ ఉండేవారుగానీ. నీ చిన్ననేస్తులుగానీ. ముఖ్యంగా తల్లి తండ్రులో. ఉపాధ్యాయులో క్షోభ్యం కలుగచేసుకొని అంతా పాడు చేస్తారు అందువల్ల చివరివరకూ నెగ్గుకొని వచ్చే సందర్భాలు చాలా తక్కువగా ఉంటాయి.

అల్లాకాకుండా శిశువుకి వుండే స్వతస్సిద్ధమైన నిష్కాపట్యంతో నీవు ఉండి, ఆ విధంగా చేయగలిగితే ఒక అద్భుతమైన జీవితాన్ని వ్యవస్థీకరించుకోగలవు నేను చెప్పినదంతా భౌతికప్రపంచానికి సంబంధించినది శైశవంలోని స్వప్నాలె వృద్ధాప్యంలోని వాస్తవాలు

# భవిష్యత్ సూచిత కలలు - వాని వ్యాఖ్యానము

భవిష్యత్తును సూచించే కలలు చాలా రకాలుగా ఉంటాయి కొన్ని కలలు వెంటనే జరుగుతాయి, అంటే ఆ తరువాత జరుగబోయేది ఆ రాత్రే కలగా వస్తుంది కొన్ని కలల ఫలితాలు కనుపించడానికి కొంత కాలవ్యవధి పడుతుంది రాత్రింబూట ఏ సమయంలో వచ్చాయో అనే దానినిబట్టి ఈ కలలను వేరువేరుగా గుర్తిస్తాము

నిరపేక్ష నిశ్చయతను సమీపిస్తున్నకొద్దీ కాలవ్యవధి ఎక్కువవుతుంది ఎందువల్లనంటే ఈ కలలు ఉద్భవకేంద్రానికి సన్నిహితంగావుండే లోకంలోని దృశ్యాలు (దర్శనాలు) అందువల్ల జరుగబోవుదాని ఆవిష్కృతి సత్యానికి అది సిద్ధించడానికీ మధ్య కాలవ్యవధి ఎక్కువగా వుంటుంది మూలస్థానానికి చాలాదగ్గరగా ఉండడంవల్ల ఆవిష్కృతసత్యం నిశ్చయము పరమేశ్వరునితో తాదాత్మ్యమునొందే స్థానం మనలో ఉంది అక్కడ ఉన్నప్పుడు అన్నిచోట్లకీ సంబంధించిన భూతభవిష్యద్వర్తమానాలు పూర్తిగా తెలుస్తాయి కానీ సామాన్యంగా అక్కడకివెళ్ళి తిరిగి వచ్చేటప్పుడు మాన

వులు వారు చూచినదంతా మరచిపోతారు. అది గుర్తుపెట్టుకోవాలంటే అత్యంత కఠినమైన ఆత్మశిక్షణ ఉండాలి. మనిషి పొరపాటులు చేయలేనటువంటి ఏకైక ప్రదేశమది.



సంఘటనలు జరుగకముందే సూక్ష్మ భౌతికంలో రూపొంది ఉన్నట్లు నీకు కలవస్తే, నీవు దానిని మార్చవచ్చుననుకుంటే, మార్చడానికి అప్పటికే ఆలస్యమైపోయినట్లా? కాక చేసేది ఏమైనా ఉంటుందా?

దీనికొక చక్కని ఉదాహరణ ఉన్నది. 'లేమేటిన్' అనే ఫ్రెంచ దినపత్రికలో (చాలాకాలం క్రిందట, అప్పటికి నీవు చాలా చిన్నవాడివై ఉండవచ్చు) ప్రతిరోజూ ఒక బాలుని చిత్రం పడేది. ఆ బాలుడు (ఒక హోటలు పనివాని దుస్తులలో) చూపుడువేలితో తారీఖునైనా, మరి దేనినైనా చూపుతూవున్నట్లుగా ఆ బొమ్మ ఉండేది. ఈ కథకు సంబంధించిన పెద్ద మనిషి ప్రయాణంచేస్తూ ఒక పెద్దహోటలులో దిగాడు. అది ఏ ఊరో నాకు గుర్తులేదు. ఒకనాటి రాత్రి, తెల్లవారుఝామున అతనికి ఒక కల వచ్చింది. పేపరులోవడే ఆ బాలుడు తన వ్రేలితో బయర్‌ను (ఐరోపాలో చనిపోయిన వారిని స్మశానానికి తీసుకొనిపోయే బండి) చూపుతూ అందులో ప్రవేశించమని అతనిని నిర్దేశిస్తున్నట్లుగా అతను కలలో చూచాడు. తెల్లవారిన తరువాత అతను లేచి కాలకృత్యాదులు పూర్తిచేసుకొని, గదినుంచి (చాలా పైన ఉన్న అంతస్తులో గది) లిఫ్టు దగ్గరకు వచ్చేసరికి అదే బాలుడు, అదే దుస్తులలో, క్రిందికి వెళ్ళడానికి సిద్ధంగావున్న లిఫ్టును ఎక్కమని చెప్పుచున్నట్లుగా వేలితో సూచించాడు. ఇతను దిగ్భ్రాంతుడై వెంటనే నిరాకరించాడు. మరుక్షణంలో లిఫ్టు కిందబడి కూలి అందులోని వారంతా మరణించారు. అప్పటినుంచి కలలంటే నమ్మకం ఏర్పడిందని అతను నాతో చెప్పాడు.